అమరదురాపామ్:- దుఃఖేన ఆప్తుంశక్యా=దురాపా, అమరైః దురాపా= అమరదురాపా, తాం అమరదురాపా, తామ్ = అమరదురాపామ్.

అపాఙ్గోత్తరఙ్గామ్ :- అపాఙ్గైః ఉత్తరఙ్గా = అపాఙ్గోత్తరఙ్గా, తామ్ = అపాఙ్గోత్తరఙ్గామ్.

ఆనన్దాన్ధ్యేన :- అన్ధస్యభావః=ఆన్ధ్యమ్, ఆనన్దేన ఆన్ధ్యమ్=ఆనన్దాన్ధ్యం, తేన = ఆనన్దాన్ధ్యేన.

తదపరాకూతపాతాన్ :- తస్యాః అపరాః = తదపరాః, ఆకూతేన పాతాః=ఆకూతపాతాః, తదపరాశ్చతే ఆకూతపాతాశ్చ = తదపరాకూత పాతాః, తాన్ = తదపరాకూతపాతాన్.

పీయూషధారావలనవిరచితేన :- పీయూషస్యధారా = పీయూషధారా, పీయూషధారాయాః వలనం = పీయూషధారావలనమ్. పీయూషధారా వలనేన, విరచితః = పీయూషధారావలన విరచితః, తేన = పీయూష ధారావలనవిరచితేన.

**భావము :**

నిజమైన నలుఁడు హృదయమును పీడనట్టి యా దమయన్తిని తన దృష్టికి పారితోషికముగా నొసంగి యనగా పూర్వము మనస్సుచేతను, ఇప్పుడు నేత్రముల తోఁడనుఁ బ్రత్యక్షముఁ గావించుకొనెను. పిదప నతడు తన దృష్టికి, దేవతలకును, దుర్లభమైనట్టి, కటాక్షములతో తరంగితమగు నామె దృష్టిని ప్రియమైన యతిథినిఁ గావించుకొనెను. ఇట్లు ఆమె దృష్టియను, నమృత ధారచే బూయఁబడిన బాణముతో, మన్మథునిచేఁ గొట్టఁబడి యానందముచే నంధుఁడై, తర్వాత నామె ప్రసరింపఁజేసిన సాభిప్రాయములును, సాభిలాషములునగు దృష్టి పాతములను వ్యర్థములనుఁ గావించెను. మొదటి దృష్టి పాతముచే నతడానంద మున మునుగుట వలన తర్వాతి దృష్టి పాతములను జూడఁజాల నందు వలన నవి వ్యర్థములైనవని యాశయము ॥౧౧౨॥

శ్లో. శ్రీహర్షం కవిరాజరాజిముకుటాలఙ్కారహీరః సుతం
శ్రీహీరః సుషువే జితేన్ద్రియచయం మామల్లదేవీ చయమ్।
తస్య ద్వాదశ ఏషమాతృచరణామ్భోజాలమౌలేర్మహా
కావ్యేఽయం వ్యగలన్నలస్య చరితే సర్గో నిసర్గోజ్జ్వలః॥

ప. వి. శ్రీహర్షం— కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః - సుతం - శ్రీహీరః - సుషువే- జితేన్ద్రియచయం- మామల్లదేవీచ— యం- తస్య - ద్వాదశః- ఏషః- మాతృచరణామ్భోజాలిమౌలేః- మహాకావ్యే—అయం—వ్యగలత్—నలస్య-చరితే—సర్గః—నిసర్గోజ్జ్వలః-



అర్థము. కవిరాజ రాజిమకుటాలఙ్కార హీరః, కవిరాజ=కవిశ్రేష్ఠుల, రాజి = వరుసయొక్క— మకుట=కిరీటమందలి, అలఙ్కార=అలఙ్కారములగు రత్నములలో, హీరః=వజ్రమణియగు, శ్రీహీరః=శ్రీహీరుఁడను మహాకవి, జితేన్ద్రియచయం, జిత=జయింపఁబడిన, ఇన్ద్రియ=ఇన్ద్రియముల యొక్క, చయం = సమూహము గల్గిన, హర్షం=శ్రీహర్ష మహాకవిని, సుషువే = కనెనో, మామల్లదేవీచ = మామల్లదేవియు, యం=ఎవనిని, సుషువే=కనెనో, మాతృచరణామ్భోజాలిమౌలేః, మాతృచరణ = తల్లి పాదములనెడి, అమ్భోజ=తామరపూవులకు, అలి=తుమ్మెదలుగా నాచరించు, మౌలేః=శిరముగల్గిన, తస్య=ఆశ్రీహర్షునియొక్క— కృతియగు, మహాకావ్యే=మహాకావ్యమైన, నలస్య=నలునియొక్క, చరితే=చరిత్రమునందు, నిసర్గోజ్జ్వలః = స్వభావముచే ప్రకాశమానమగు, ఏషః = ఈ, ద్వాదశః=పంఁడెండవ, సర్గః=సర్గ, అయంవ్యగలత్=ఇదిగో పూర్తి యైనది.



**సమాసములు :**

కవిరాజరాజిమకుటాలఙ్కార హీరః :— కవీనాం రాజానః=కవిరాజాః, కవిరాజానాం రాజిః=కవిరాజరాజిః, కవిరాజ రాజేః మకుటం=కవిరాజ రాజి మకుటం, కవిరాజరాజి మకుటస్య అలఙ్కారాః = కవిరాజరాజి మకుటాలఙ్కారాః, కవిరాజరాజి మకుటాలఙ్కారేషు హీరః = కవిరాజ రాజి మకుటాలఙ్కారహీరః।

జితేన్ద్రియచయం :— ఇన్ద్రియాణాంచయః = ఇన్ద్రియచయః, జితః ఇన్ద్రియచయః యేనసః = జితేన్ద్రియచయః, తమ్—జితేన్ద్రియచయమ్. మాతృచరణామ్భో జాలిమౌలేః :— మాతుః చరణౌ = మాతృచరణౌ, మాతృచరణావేవ, అమ్భోజే=మాతృచరణామ్భోజే, మాతృచరణామ్భో

జనయోః ఆలిః = మాతృచరణామ్భోజాలిః, మాతృచరణామ్భోజాలి రేవ మౌలిః యస్యసః=మాతృచరణామ్భో జాలిమౌలిః, తస్య=మాతృచరణామ్భో జాలిమౌలేః।

నిసర్గోజ్జ్వలః :— నిసర్గేణ ఉజ్జ్వలః=నిసర్గోజ్జ్వలః.

**భావము :**

కవిశ్రేష్ఠుల పంక్తియొక్క కిరీటాలంకారమణులలో వజ్రమణియగు శ్రీహీరకవియు, మామల్లదేవియు శ్రీహర్షకవినిఁ గనిరి. తల్లిపాదములనెడి తామరపూవులకుఁ తుమ్మెదవలె నాచరించు శిరముగల్గిన యాశ్రీహర్షుఁడు రచియించిన మహాకావ్యమగు నలచరిత్రమునందుఁ బండ్రెండవ సర్గ పరిసమాప్తము ॥౧౧౩॥

ఇట్లు
శ్రీమదాత్రేయగోత్రోద్భవ ఉడాలినరసింహసూరి
తనూజసుబ్బరామశాస్త్రి విరచితమగు
శ్రీహర్షనైషధ వ్యాఖ్యయందు
ద్వాదశసర్గ సమాప్తము
ఓం
శమ్